[సీసపద్యము]

ఎఱుఁగుదు నెఱుఁగుదు
భవుని గిరిఁ గ్రిందఁబడి శృంగభంగ మొంది
కార్తవీర్యుని చేతఁబడి గడ్డి కఱచి
వాలివాలంబునం జుట్టఁబడిన నిన్నుఁ
దెలియుదును దైత్య! త్రైలోక్యవిలయకేతు!

రావ... హాహాహా! ఈపిట్ట మిక్కిలి కూఁత వట్టినదే!
ఉండుము నీవు; సీతయు మదార్జితకర్మమునఁ జామచేగాక; నే
ఖండనభూమి మున్ను రిపుశాలి ఘటించెను మత్కరాసి నా
ఖండలుఁ డద్రిఁబోలెఁ గడఁకన్ దివి నాడెడు నీపులుంగు ను
ద్దండత నేల రాల్చెదను దర్పసపక్షవిఖండనంబునన్.

(ప్రవేశించి)

జటా... చూచెదను లే!
చెలరేఁగ రేయిఁ గార్చిచ్చు, సంధీప్తిఁ
జెందు నంజనగిరి శృంగము ల్పోలెఁ
బ్రలయమేఘద్యుతిఁ బరగు నీకపిల
వర్ణ కేశంబులో పదికొంబులను
గొలగొల నెత్తురువాఁగులు వారుచుండఁ
గులిశము న్మించు మకుటంబులు గ్రుచ్చి గ్రుచ్చి
బలువేడ్క నీవీరపత్ని వీక్షింపఁ
బదిదిక్కులం బడి పడ మృత్యువాఁడ!

సూతు... ఇదే యిదే యెగిరి వచ్చుచున్నాఁడు!

రావ... నిలువుము.

(ఇర్వురును యుద్ధము చేయుదురు)

రావ... ఈదెబ్బ కాచుకొనుము. (కొట్టును)

(సీతచూడఁ జాలక కన్నులు మూసికొని యేడ్చును)

సూతు... అయ్యో! గృధ్రరాజు పడిపోయినాఁడు!

క్షతజజన్మకసోత్కరోక్షితాంగనుండు
శ్రమనిరుద్ధవిభుగ్నదుర్బలగళుండు
దినవిరామపయోధసందీప్తుఁడగుచు
బడెనుఁబత్త్రరథుం డభ్రపథమునుండి.

సీత... అయ్యో! దేవతలు నిష్కరుణులు! దౌర్భాగ్యురాలను నా-
కైయీపక్షి రాజు శోచనీయుఁడయ్యె-

రావ... సూతుఁడా! అశ్వముల వేగఁ దోలుము.

సూతు... ఆయుష్మంతుని యాజ్ఞ.

హితము ననుకూల మాత్మసంగతము సర్వ
మంగళకరహాస్యయుతము శ్రవ్యమ్మునైన
నావచస్సుల కితఁడు కర్ణముల నిడఁడు.
కాఁడు మదిరామేమొ? సగ్రహణమేమొ?
(నిష్క్రమింతురు)



జ టా యు ర్వ ధాం క ము

## ప్రవేశకము

(మండోదరియుఁ జేటియుఁ బ్రవేశింతురు)

మండో...ఏమి ! ఇదియుఁ గానున్నదా ?

చేటి...అమ్మగారిముఖము మనస్తాపమును గ్రక్కుచున్నది.

మండో...ఓసీ ! నీ వశోకవనమును జొచ్చి యుంటివా ?

చేటి...అవు నమ్మా ! అక్కడ దొరగారిచేఁ జెఱపట్టఁబడిన తపసి యిల్లా లున్నది!

మండో...ఆమెయే మావినాశనమునకుఁ గారణముగాఁ గన్పట్టుచున్నది.

చేటి...అమ్మా ! ఎప్పుడును లేళ్ళ బెబ్బెంగల నమ్మవు. ఆమె యెట్లు వచ్చెనో యట్లే పోవుర – అమ్మగారే యెల్లపుడును లంకాధీశ్వరి.

మండో...వెఱ్ఱిదానివలె నున్నావు ఇంతఁగాఁ గలిసి మెలసి యుండియు నాభావము నెఱుంగఁజాలవైతివి – నా కొక పాడుకల వచ్చినది!

చేటి...శాంతించుఁగాక శాంతించుఁగాక. చెప్పు మమ్మా !

మండో...ఓసీ విను. కెరటము లన్నిదెసల వ్యాపింప జలజంతువులు తుళ్లి తుళ్లి మిట్టిపడుచుండ మరకతపర్వతముల సమూహము వలె నీలమై యొప్పారు సముద్రము కొన్ని గడ్డిపోచలు వచ్చిపడుటచే క్షణములో నెండిపోయినది.

చేటి...అమ్మయ్యో !

మండో...నేనును దలనిండ నిసుక పోసికొని – దూరదూరముగ నున్న పండ్లును భయము గొల్పు మొగమును అగ్నికణములు రాల్చు కన్నులును శూర్పకర్ణములును కపాలవర్ణమును గలయొకా నొక యమంగళస్త్రీచే బిగ్గఁ గౌఁగిలింపఁ బడితిని.

చేటి...ఓయమ్మ !

మండో... ఆసీతయుఁ దెల్లనిపట్టుచీర కట్టుకొని, హృదయమునఁ జందనము పూసికొని, కొప్పున మల్లెపూవులు దుఱుముకొని భర్తకే లూఁతయొసఁగఁ బుష్పక సౌధిరోహించుచుండ నేఁజూచితిని. హఠాత్తుగఁ దెలివి వచ్చినది.

చేటి... అమ్మా ! విచారింపవలదు. కలల కనేక కారణములు చెప్పుదురు వైద్యులు. కానున్నను- ముల్లోకములకు భయముగూర్చు మనకు భయ మున నేమి ?

(నేపథ్యమున)

ఘనములు నింపుఁగాత సురసగంధదళం బగుపుష్పవృష్టి; స్వ
ర్ధునిఘనవీచికావితతిఁ దూఁగి రహించుత స్వర్గవాయువుల్;
పూనరవసంతముఖ్యఋతువుల్ మొగిఁ బెంచుత నందనప్రభన్;
దనపదముల్ నివుడ్చి హోమకాముఁడు దిగ్వలయమ్ముఁ జుట్టుఁగాత.

మండో... చాటింపువలె నున్నది ! వెళ్ళి కన్గొనిరా!

(చేటి నిష్క్రమించును)

మండో... కన్గొనుట కేమున్నది! ఆమనుష్యకాంత మనస్సు లోఁగొన మహారాజుగారి ప్రయత్న మిది !

(చేటి ప్రవేశించి చెప్పుట నభినయించును)

మండో... నీయాయాసమాత్రము మిగిలినది. ఇపుడు మహారాజుగారేమి చేయుచున్నారు ?

చేటి... సీతను జూచుటకై ప్రభువువారు ప్రదోషవేషము ధరించుచున్నారు.

మండో... అయినరావే ! మహారాజుగారికిఁ దెలియకుండ- అశోకవనముఁ బ్రవేశించి, లీవజొంపములమాటున డాగి, కామింపని సీతవిషయమున మహారాజుగారికాముకవృత్తిని జూచి యుపహాసింతము.

చేటి... చిత్తము.

(నిష్క్రమింతురు)

(అమాత్యుండు ప్రవేశించును)

అమా...(అంతటంజూచి) ఓహో! ఇంతకాలమునకు రాక్షసలోకము
చంద్రకాంతి ననుభవించుచున్నది!

అదిగో! భగవంతుం డుదయించె నమృతమూర్తి
స్మరుని సేనావిభుండు తుషారరశ్మి-
క్షీరపాథోధివిలయవీచికలంబోలె
జీవలోకమ్ము తన్మరీచికల మునుంగ!

రావ...హిమకరా! హిమగర్భ! పుష్పేషువశుండ
నైన నాపయి సిరస్సు లగ్గి గ్రక్కు-
నీదియుం గాదు పుష్పేషునిదియుం గాదు
శర్వరీనాథ! యిది సీత శక్తిగాని!

అమా...కన్నది సేసి స్వామికో అగామి రఘూద్వహుచే నశింతునా ?
తిన్నగ బాగు సెప్పి కడతేరుదునా ఖలుండైనస్వామిచే?
బన్నము నాకు నెట్లయినం బాటిలు; రెంటను స్వామిచేతిచా
విన్నంగం గొంత మే లటగునేం గనకుండురుస్వామినాశమున్.

ప్రభునివృత్తాంతము కష్టముగా నున్నది. ఇతండు తోంకచేం గట్టం
బడి రోకలిచే మొత్తంబడుచున్నాండు ఇదుగో ప్రభువు!

నాడంగ మోవి యూర్పు చెదో భావన సేయుచు నావులించుచుం
బీడంగ వానకారు జిగి బీకుచు నుండు ఘనంబుకైవడిన్
బాడబపీత వారినిధి పాటిసగూఢతం గామతప్తుండై
పోడిమి వీడి మేన క్షయముం గొను నన్యపదుర్గముంబుగన్!

జయము జయము మహాప్రభూ!

రావ...క్రొత్త విశేషమేం గలవా?

అమా...(తనలో) ప్రభువు ప్రసన్నుండై యున్నాండు (వెలికి) జనప్రవా
దము కలదు-

రావ...వాలిని జంపి సుగ్రీవుని యొద్దనున్నాండు రాముండనియేనా?

అమా... చిత్రము. విశేషముఁగలదు.

రావ... అది చెప్పుము.

అమా... తదాజ్ఞచే సీతాన్వేషణార్థ మన్ని దిక్కులను వానరసైన్యము
సంచరించుచున్నదని.

రావ... ఏమేమీ! అన్నిదిక్కులను సీతాన్వేషణార్థము తదాజ్ఞచే
వానరసైన్యము సంచరించు చున్నదనియా?

అమితభయావహాహిభవనాంచితశైలము లాయుధంబులుగా
సమరజయోద్భటాప్రతిభటాసురసైన్యము మోహరించినన్
సమరముఁ గను నిల్చు నెటు నందనవృక్షలతాప్రసూనప
త్రములకు నేలరాల్పఁగను దక్షము లైన ప్లవంగయోధముల్?

అమా... వానరు లత్యంతము బహాసింపఁ దగినవారగుదురుగాక-
ఇం కేమన—

రావ... ఇం కేమి?

అమా... దాశరథి ధనుర్ధరులలో నజయ్యుఁ డందురు.

రావ... అలాగ?

ఏనిసమక్షమునందున సురేశ్వరుఁడు న్నిలువంగఁ జాలఁడో
యేనిమహాభుజంబులు మహేశ్వరుశైలము నూఁపఁ జాలెనో
యేనిపరాక్రమంబునకు నెల్లగ్రహాళి గ్రహాళి డునో
వాని కజయ్యుఁ డౌనగుఁడు? పందవు నిన్నన నవ్వ వచ్చెడిన్.

అమా... రాముఁడు నరుఁడా మహాప్రభూ?

గురునియోగతి వనములం దిరుగుచాము
నరయుఁ జెల్లున కేవలనరునకుఁ గాఁగ?
లోకసృష్టిస్థితిప్రళయైక హేతు
వతఁడు హరిదశ్వకులజుఁడౌ హరియె కాఁడె?

రావ... ఏమేమి? కేశవుఁడే యనియా? అయినను భయస్థానమా వాఁడు?

అతనియగ్రజు దేవేంద్రు నడలఁ గొట్టి
స్వర్గమును నాభటుల్ గొడుపఱచువేళ

నచ్చెర్లలల్లోడ శచి యంగలార్చువేళ
నీహారిమహాత్త్వ మెల్ల నే యేటఁ గలిసె?

అమా... దేవతల జయించిన దెవరు?

రావ... ఏమి? దేవతల జయించినవానినే యెఱుఁగవా?

అమా... ఎఱుఁగను.

రావ... నేను.

అమా... కల్లకల్ల.

యమకుబేరేంద్రముఖ్యులౌ నమృతభుజుల
నీవు యత్నమ్ము లేక జయించితేని
యెటులు నీధైర్యసారం బదెల్ల నేఁడు
పుష్పశరుపుష్పశరములఁ బూదిఁ గలిసె?

రావ... పుష్పశరుఁడు నన్నుఁ బ్రహరించుచున్నాఁడని తలంతువా?

అమా... పరిత్యక్తమే!

రావ... సత్యముగ నిది పరిత్యక్తవిషయమే.

పురహరుకంఠహరాంతలను త్రొల్లిటి నాఁడె కథావశేషుఁడౌ
స్మరుఁడిపు డేవిధాన శరసంతతి నన్ బరిమార్చెనఁ జెప్పుమా?
శరదమృతాంశుకాంతియు సుసంగతకారము భ్రామనోజ్ఞమై
పరఁగెడుసీతమోము పలుభంగుల నన్వివశాత్ముఁ జేసెడిన్!

అమా... వేదవిద్యాధ్యయనలక్ష్మి వెలసినావు!
ఆస్వయంభువునకును దాయాదుఁడీవు!
అన్యసతియందు నెకదొట్టు నాస్థ చేతఁ
దోరముగ నేల యిట్లపదూరువడుదు?

రావ... ఇదియును నిందయా?

అమా... ఇంతకంటెను నింద గలదా మహారాజా ?

రావ... అట్లయిన-

కోరినను తప్పక నూఱుయాగము లొనర్చి
కర్త లేనట్టిపలుకుల ఖ్యాతి వడసి
యనుగులకు భర్త హరి కన్యమైనయింద్రుఁ
బిలువఁగా నేమిటి కహల్య పేఁగలిపి?

అమా... నిందమాట యటుండ నిండు. స్వార్థసాధనమగుధర్మమును
మనము వెడల నడచినట్లే గదా?

రావ... నీతి దెలిసినవాఁడా? సాధ్యాపేక్షముగదా సాధనపరిగ్రహము!
కలుగునయేని స్వర్గపదకాంక్షయె నాకు సహాయ మయ్యెడిఁ
బలరిపున్ వ్రజపాతము సహాస్త్ర మొనర్చును చంద్రహాసమే!
తలఁగు తలంపఁబోకు మిఁక ధర్మము; అయ్యది సాధనంబు దు
ర్బలులకు; మనుష్యుబోఁటి బలవంతుల కంతయుఁ బథ్యమే సుమా!

అమా... ప్రభువుల శక్తి యట్టిదియే. శక్తిమంతులగు మీబోంట్లచే
సదాచారము పరిత్యక్త మగుచున్నది. అయినను రాజర్షివృత్తి
పరాయణుఁడగు రామునిదెస సాధుత్వ మపేక్షణీయము.

రావ... ఏమేమీ రాముఁడు సాధువా?
తాటకఁ జేర్చెఁ గృతాంతునిశాంతము
ధర్మ్యాలధర్మముఁ ద్రుంచి వెసన్;
చాటునఁ బొంచి శరంబున వాలిని
జక్కడఁచెం గనుచో ననుజున్;
బోటరిపోల్కి ధనుస్సుఁ దపోధను
పోల్కి జటాధర మూనినయా
జూటరి సాధు వసాధులమేము! శి
శుల్ పరవిశ్వసనాత్ములహో!

అమా... దేవా! నా కింతవఱకే యధికారము.

రావ... చెప్పు మేమినీయధికారము?

అమా... త్రివర్గప్రాపణము.

రావ... ఏ మా త్రివర్గము?

అమా... ధర్మార్థ కామములు.

రావ... ఒకటొకటిగాఁ జెప్పు.

అమా... ధర్మము

రావ... దంష్ట్రాదండనోద్దండు నిదండధరుని
దండితు నొనర్చినాఁడ నే దండనములఁ
బ్రదివసంపదయును నాయధీన మయ్యె
ధర్మమిఁకేల త్రివ్వి నా తలకు నెత్తు?

అమా... అర్థము.

రావ... అర్థము సాధించు నదేమి?

అమా... కోశదండముల యభ్యున్నతి.

రావ... బైలేలను దిరుగాడు ఫౌజు మాది;
మాఖజానా కు బేసుండు మాగురుండు;
క్రాలు మాయర చేత జగాలు మూఁడు;
నర్థ మిం కేల మాకు యుదార్థముగను?

అమా... కామము.

రావ... మేము దానినే కోరుచున్నాము; దానిచేతనే మా కోర్కి.
నిండఁదగినది.

అమా... అందునను మనస్సు హెచ్చుగనే పోవలసినది గదా?

రావ... అట్లే పోయినది.

అమా... అట్లయిన—
అన్యభుక్త విరక్త ధరానుషక్త
చాలు నీయింతికై యింతబాళి యేల?
అందమున నింద్రుసుందరీబృంద మెల్ల
నజరునకుఁ గాదు నీజనానాకు నిజము!

రావ... తెలియనివాఁడా! ఈవిషయమున నితరుఁడు ప్రమాణముగాదు,
మఱియు.

పరభు క్తియుగును లక్ష్మియు;

వరరత్నంబును దాఁట వసుధాకరమున్;

గరమును విరక్తియగు నా

క్తమణియు; విడు నెవ్వఁ? డటులె ధర్మం బిదియున్.

అమా...(తనలో)ఇఁక మీఁద నాయుధములే గతి. ప్రభువులు ప్రజ్ఞా సాహచర్యము నతిక్రమించిరి.

రావ...పొమ్ము రామువార్తల నెఱుంగ నింకను చారుల నియోగింపుము.

అమా...ప్రభువుల యాజ్ఞ.

అవివలని భీతిచేఁ గాని యరులమీఁది

ప్రీతిచేఁగాని నీకు నప్రియము పలుకఁ

గంఠదేశంబునందున గత్తి నిడిన

నధిపునకు సజ్జనుండు పథ్యమె వచించు.

(నిష్క్రమించును)

రావ...వర్షవర! అశోకవనమునకు దారిఁ జూపుము.

వర్ష...చిత్తము.

(ఇర్వురు నుద్యానమునఁ బ్రవేశింతురు)

రావ...(అంతటఁ జూచి)ఆహా! చిత్తము పరిచితమయ్యెను బరవశమగుచున్నదే! ఇక్కడనుండియు సీత రామతపోవనమునే చింతించుచున్నదా?

నాకవిభూషణంబు లివి నందనవృక్షము లింద్రుఁ డుండ మం

దాకిని యొడ్డునుండి భుజదర్పమునం బెకలించి తెచ్చితిన్-

ఈకడ నంచజంటలు మొగి షేవసరోజమరంద మానుఁ బుం

స్కోకిలముల్ చివుళ్ళు నవకోరకములు గ్రోలి చొక్కు నిద్దెడన్!

వర్ష...తుమ్మెదపిండు సంపగివాసనంబోలె సీత రావణవిభవమును జూచుచున్నది.

(కామావేశము నిరూపించి)

రావ...లోకుల కెవండు గూర్చు నశోకమాత
మంజరీబాణమూర్తి నే భంజనంబు
నా యుద్యానంబునన నిప్పు డలరె దేవ
వృక్షమున శాఖాసంచయం బింక నేమి!
వర్షవర! సీత శింశుపావృక్షముక్రింద నున్నదా?

వర్ష...చిత్తము దేవర?

రావ...సీత—

నేఁగన నన్నవజ్ఞఁ గను; నే శ్రుతిప్రియముగాఁ వచించినన్
దాఁ గరపల్లవంబులను దార్చును వీనుల; నక్రమమూర్తినై
నేఁ గనుదోయి కట్టెదుట నిల్చినఁ దాఁ బలవించు రామునిన్-
జాగు దినంబు లిట్టులుగఁ జానప్రసాదనసాధనం బెదో!

(తరువాత శింశుపావృక్షముక్రింద సీతయు లతావలయములమాటున
మండోదరియుఁ జేటియుఁ బ్రవేశింతురు)

సీత...ఓహో రాక్షసుల నిర్దాక్షిణ్యము!

మండో...ఓసీ! ఇదిగో మహారాజు గారు! ఇంత కాల మూహించుచున్న
దిపుడు కనులారఁ జూడవచ్చును.

రావ...(సమీపించి) దేవీ!

సీత...ఈపాపాత్ముఁ డిం కేమి పల్కునో!

రావ...గాంగజలంబుల న్మునిఁగి కల్పకుజంబుల కాన్క లెల్లఁ బే
ర్మింగొని వెండికొండ విహరింపు; చరింపుము నందనాసన; ద
న్వంగి! తపస్సుచేతను మరాపయ మీరును స్వర్గలక్ష్మి; దా
నిం గననీదు తె న్నణంచి నీదుసతీత్వమె యడ్డగోడయై.

సీత...నీస్వర్గము నీకైనక. ఆర్యపుత్రునితో నరకమున కైనఁ బోవుదును.

రావ...దేవీ! నీకొఱ కంతఃపుర మెల్ల విడిచి వైతును.

మండో...మహారాజా! ఈమాట క్షమించి నుంచుకొనుడు,

సీత... కాదు కాదు. కేవల మంతఃపురమే కాదు నాకొఱకు నీవు ప్రాణ
ములుకూడ విడిచివైతువు.

మండో... ఈనరకాంత యెంతకఠోరముగఁ బల్కుచున్నది!

రావ... నిజము నాప్రాణములఁ గాముఁడు హరించుచున్నాఁడు.

సీత... కాదుకాదు రాముఁడు_ రామునికంటెను సురూపుఁడు.

(అట్టహాస మొనర్చి)

రావ... వనచరవృత్తి క్షత్రకులబంధువు యుద్ధమునందు వైచుత
తృణమయశస్త్రమింతయు సహింపఁడు రావణుఁ డంట యుక్తమే!
ఘనగిరిపక్షఖండనసుకర్కశవజ్ర ముఖంబునందు ఐ
వ్వన వనదండవోలె నలవోక ధరించు వలంతి యింతిరో!

మండో... ఇపుడు మహారాజేమి చేయుదురు? ఈమె దేనికిని మెత్తబడ
కున్నదే!

రావ... దేవి! ఇదిగో అంజలి.

ఖచరదైత్యాహిగంధర్వకన్యకాస
నాధనా సస్మదీయావరోధవధ్వు
సర్వమును దాస్యకృత్యమ్ము సలుపు నీకు
మించుఁబోణిరో! ననుఁ గటాక్షించెదేని.

మండో... నేనుదాస్యమొనఁజేయుదును ఇతరులవిషయము నే నెఱుంగను.

చేటి... అమ్మా! చూడుఁడు చూడుఁడు- అన్ని మొగల నంజలిపుటములఁ
గూర్చుటచే వికసించినపద్మములతోడిసముద్రమువలె నున్నారు
ప్రభువువారు.

మండో... అభిలాషభంగమున నిశతీవ్రతయుఁడు మహారాజుగారు కుపి
తులుగారు గదా!

వర్ష... (తనలో) ఏ మీదృశ్యము!

కృశము శరపాండలశరీరరేఖయైన
వృద్ధ్యాసుత యామినిఁ జంద్రరేఖవోలె!

మొగిచి యిర్వదిచేతులు ముకుళితాబ్జ
మైనపద్మాకరం బట్టు లలరు నితఁడు!

రావ... దేవి! ఇదే యనునయసర్వస్వ మగునంజలి.

(సాష్టాంగముగఁ బ్రణమిల్లుచు)

(సీత పాదము దవ్వులకు లాగికొనును)

మండో... ఈమె ధీరురాలు! మహారాజుగారి శిరస్సును బురదనుబోలె వదలించుకొనుచున్నది! సత్యమే సీత భూసుతయు రాముఁడు పద్మనాభుఁడు ననుజనప్రవాదము.

వర్ష... రాజపుత్రి! మహారాజుగారిప్రణిపాత మేల యుపేక్షింతువు?
పరినిగూర్చి విప్రులు యజింతురు నమింతురు శివంబు గోరి య
వ్వారలు రాజరాజయమవాసవముఖ్యులు ముఖ్యదేవతల్
కోరి స్వమానము వ్విడిచి కొల్తురు చేతులు మోడ్చి యేని నా
ధీరుఁడు నీకు మ్రొక్కటికి నతిం బొనరించు దశాననుంబులా.

సీత... ఇది ప్రణిపాతముగాదు. వినిపాతము.

వర్ష... ఈమను దేర్ప సాధ్యముగాదు.

రావ... దేవి! నీపాదములు నాకు శరణము.

సీత... ఆర్యపుత్రుని పాదములు శరణు గొమ్ము.

రావ... (సరోషముగ వేగ లేచి) ఏమేమి!

అఖిలవర్ణాళిరుండి మస్తాంశ మొంది
భువిని పార్జన్యము నయించు భూమిపతుల
కల్లరకు నాలు మొగిని నీతల్లి ధరణి;
నీకును బతివ్రతాశీల నియతి యేల?

ఎక్కడ చంద్రహాసము?

(అందఱు భయమభినయింతురు)

సీత... ఇది మీకే ! ఆర్యపుత్రుని పాదములే నాప్రాణములకు గతి.

మండో... అయ్యో! ఇంతకు వచ్చెనా ? ఈమె పతివ్రత. నా ప్రాణము లొడ్డియైన మహారాజుగారి యాగ్రహమునుండి రక్షింతును.

(కేగవచ్చి వారినడుమ నిల్చి)

మహారాజా ! జయము జయము.

రావ... హా హా! దేవిమయసుతమండోదరి! (అధోముఖుఁడై నిల్చును)

మండో... మహారాజ ! మీచంద్రహాసమున కీమె భర్త రాముఁడే తగఁడు. చెలియున్న యీమెయా ? మీ రుపేక్షించిన నీమె తనంతట తానే ప్రాణములు విడుచును.

వర్ష... (తనలో)

రాజిలు ధరిత్రివోలె సీతాజపతి !

పోలుచు మాప్రభు వితఁడు సముద్రునట్లు !

కడఁక నిలఁ బొల్చు చెలియలికట్టవోలె

నయమున నిల్చియున్న దీనయకుమారి !

ఇదే సమయము (వెలికి) దేవా ! మీరు ఖడ్గము ధరింప నేల?

అమరులయవస్థఁ గని హరి యగ్గిఁ గురియు

తనసుదర్శనచక్రమ్ముఁ దాల్చెనాఁడొ ?

కాక మీదెస హరుఁడు తక్షకగుణమ్ము

నమిత మొనరించినాఁడొ పినాకధనువు ?

రావ... నిజము నిజము.

(నేపథ్యమున)

జయము స్వామీ; జయము మహారాజా! జయము భద్రముఖా! జయము లంకేశ్వరా! పదినాడికలు గడచినవి. స్నానవేళయతి క్రమించు చున్నది. మహారాజా! దయచేయుఁడు !

(శంఖపటహధ్వనులు మ్రోఁగుచున్నవి)

రావ... ఇక్ష్వాకు వీరా రక్షింపుడిరి. కానిందు ప్రహారములం కాతును,

[సపరివారముగ నిష్క్రమించును]

సీత... ఆర్యపుత్రుండుగా కింకొకయాస లేనిదానను. రాక్షసుని చెరిచా విడి పాపభూయిష్ఠము. కావున నార్యపుత్రుని స్మరించుకొనుచు స్వాయముగనె జీవితము పరిత్యజింతును. (చూచి) అదృష్టమే! రాక్షసస్త్రీలు నిద్రించిరి. కానిమ్ము. రాక్షసుని తల తాకుటచేం బాంసులమైన యీ పాదము ననంతరాయముగం బుష్కరిణిలోం గడిగికొని పరిశుద్ధనై దుఃఖవిముక్తి నందుదును.

[నిష్క్రమించును]



అశోకవనికాంకము.

## —షష్ఠాంకము—

### ౧

[తర్వాత నంగుళీయకహస్తుఁడు హనుమంతుఁడు ప్రవేశించును]

హను... లవణాంభోనిధి యాప్తబాంధవు సముల్లంఘించి మైనాకు వ

ర్భవితానంబు విడ న్నభశ్శిథిలచర్మాంబట్లు నాధాక విం

తవర్ణ మున్గురు లుంగరంబుఁగొని సీతాదేవికై పేర్మి రా

ఘవదేవుం డదరించుచోణ మటు లంకారాజ్యముం జేరితిన్.

దేవి శింశుపాశ్రితయై యున్నదని గృధ్రరాజు చెప్పెను; ఆయు

ద్యానమే ప్రదేశమునన్నదో ! (పరికించి చూచి)

ఓహో రాక్షసనగరిపరమశోభ ! సత్యమే యిది.—

బృందారకమందిరమున

నందంబుగఁ గంటి కేపదార్థము లఱరున్

వెందీయ కసురుఁ [illegible] యె

ల్లం దెచ్చి యమర్చెఁగంట లంకాపురిలో !

(స్పర్శము నిరూపించి) ఈయుద్యానమేకాఁ దగును- ఇదియే

యగును.

మదకలమిళిందఝుంకారమంగళుండు

ద్రుమకుసుమభాసురపరాగధూర్వహుండు

సారసతరంగి సంగతుషారతనుఁడు

మన్గుసుఁడె చెప్పుచున్నాఁడు మారుతుండు.

ఇదే యీయుద్యానముఁ బ్రవేశింతును.

[ప్రవేశించి యంతటఁజూచి సవిస్మయముగ]

తలిరుల్ పట్టుపటంబులొఁ బువులు ముత్యంబుల్ ప్రవాళంబులొ

ఫలముల్ మొల్క-లు పచ్చలొ దళములున్ వైడూర్యముల్ మేటికా

(తర్వాత నిలబడియుండు సీత ప్రవేశించును)

సీత... చంద్ర! నిన్ను నే నిందింతును. నీకు శుత్రిబాంధవ్యము విన వచ్చుచున్నది. సమానుఁడవని ని న్నార్యపుత్రునితోఁ గలిపి లోకము పలుకుచున్నది. కాదు కాదు. నే నున్మత్తురాలను. నీ వెక్కడ? ఆర్యపుత్రుఁ డెక్కడ? నీవు రోజు కొక్కొక భార్యను జేకొని కౌఁగిలింతువు. ఆర్యపుత్రునకు మందభాగ్యనగు నాయందే మక్కువ. పోని. ఇది యిటుండనీ. నన్నిట్లొకతెను జూచుచున్నావు; ఆర్యపుత్రునొక్కని జూచుచున్నావు. ఒక్కింతయుఁ బలుకక యే తటస్థునివలెఁ బోవుచున్నావే!

హను... ఈమె విలాపాంతమునఁ గనంబడుదును.

సీత... సప్తర్షులని విన వచ్చువారు వీరే! ఈయన యే గదా భగవంతుఁడు రఘుకులోపాధ్యాయుఁడగు వసిష్ఠుఁడు! ఈమెయే పతివ్రతలకు నిదర్శనభూతయగు భగవతి యరుంధతీదేవి! భగవతీ! ఏ మీవ్యవసాయము? రాక్షసగోచరమగు నీదేశమున నా కొక్క ప్రతీకారమును జెప్పవైతివి! సర్వథా నీదర్శనఫలము నే నన్యథాకరింతును.

హను... దేవి! నే నాటంకపఱచుచున్నాను.

సీత... ఎందుండి యీయాక్రందనము! (ఇంకొకయెడఁ జూచి) ఇదే చక్రవాకవధువు రాత్రియను రాక్షసునిచే నెడసేయఁబడి నావలెనే వ్యర్థముగ నరణ్యరోదన మొనర్చుచున్నది.

హను... స్వామిని! ఇది యరణ్యరోదనముగాదు నీభర్త పూజ్యపాదుఁడగు శ్రీరాముఁడే యీమాటలువినుచున్నాఁడు.

సీత... నేను దేవతల నిందించుచున్నానే- వారి కేల నాపై నీయనుగ్రహము? కాకున్న నిది రాక్షసుని యింకొక మాయయా?

హను... స్వామిని! సంశయము వలదు. దూత నమ్మా నేను మనువంశప్రదీపుఁడగు నార్యశ్రీరామునకు.

సీత... మధురము పలికెనవచనము, రాక్షసజాతి కానే కాఁడు పుట్టనుండి
వానర మెట్లు పుట్టును ?
హను... దేవి ! నీ కిదే యంజలి
సీత... నీరూపముఁ జూపుము- కోటరము వెల్వడి రమ్ము.
హను... దేవి యాజ్ఞ. (దిగి ప్రణామ మొనర్చును)
సీత... వానరుఁ డితఁడు. తలఁచు రాక్షసుఁ డీరూపము గ్రహింపఁడు.
[నమస్కార మొనర్చుచు]
హను... పావనుల రాజఋషులఁ బావనులఁ జేతు
జనకు జనకుని విభు రామచంద్రు నీవు;
అతుపారాచలుని సలిలాధినాథు
నఖిలజనవంద్యమైన జాహ్నవిపిధాన.
సీత... మధుర వాగ్బృహ్మ యగు సీతఁ డెవఁడు? ప్రశ్నింతును వీనిని.
తర్వాతఁ బరీక్షింపఁ బ్రమాణ మాశ్చర్యమాడామని కలదు
గదా? సవిస్తరముగాఁ జెప్పుము-ఎవఁడవు నీవు ? ఏయుపాయ
మున నార్యపుత్రునితో సంసర్గము గల్గినది?
హను... దేవి వినుఁగాక. నేను వాయుపుత్రుఁడను; సుగ్రీవుని యాజ్ఞా
కరుఁడన; పేరు హనుమంతుఁడు.
సీత... అలాగా?
హను... ఆసుగ్రీవున కగ్రజుఁడగు వాలితో స్త్రీనిమిత్తముగాను రాజ్య
నిమిత్తముగాను వైరము పెరిగినది. అంత నాసుగ్రీవుఁడు వాలి
భయంబునఁ జతురంతమగు పృథివి నెల్లఁ బ్రాదేశమాత్రముఁ
బలెనే పర్యటించెను.
సీత... పాపము!
హను... అంత సుగ్రీవుఁడు మునిశాపబలమ్మున వాలిభయ మ్మొలుంగని
మాల్యవంతమను పర్వతమున నుండెను,
సీత... పోనీ!

హను... అపు డాకాలేయనందే నవంచనస్వభావుండును అల్పాయుష్మం
డునునగు రాక్షసునిచే స్వాములు కష్టమగు నవస్థాంతరముఁ
బొందింపఁబడిరి.

సీత... అయ్యో!

హను... అమ్మా! ధీరుఁడైనట్టి శ్రీరామచంద్రుఁడు కారణబలంబున
సముద్రమువలె నధీరత్వముఁ బొందెను.

సీత... మందభాగ్యను!

హను... పిదప మహాయువగు జటాయువు ప్రమాణమున మిమ్ము నన్వే
షించుకొనుటకుఁ దమ్మునితోఁగూడ శైలమునుండి శైలమును
అరణ్యమునుండి యరణ్యమును మాటిమాటికిఁ బాదన్యాసము
లచేఁ బవిత్ర మొనర్చుచుండెను.

సీత... ఎంత కష్టము!

హను... తర్వాత వాలియనుచరజనముఁ బరీక్షింప సుగ్రీవాజ్ఞచే సంచ
రించు నేను ఒకానొకవనాంతరమున దేవరఁ జూచితిని.

సీత... నిజము! నీకన్నులతో నే!

హను... మరేమమ్మా!

సీత... చెప్పు చెప్పు. ఆర్యపుత్రుఁ డెట్టివాఁడు?

హను... అవాఙ్మానసగోచరుని వర్ణింప నావశమా తల్లీ!

చరణంబు లున్నతో జ్జ్వలనఖంబులును
శంఖచక్రాంక భాస్వరతలమ్ములును!
శిరములు చిఱుతొడల్! చిన్ని నెన్నడుము
చెలునారు మణిశిలా శ్రీమండలమ్ము!
ఉరము శ్రీవత్సాంక! మరు బాహుయుగళి
యురగాయతమ్ము మహోద్దండబలము!
సరసిజరమ్యమ్ము చక్షుర్ద్వయమ్ము!
సంపూర్ణశశిసుప్రసన్నమ్ము ముఖము.

సీత...ఇపు డార్యపుత్రుఁడు కన్నులకుఁ గన్పట్టుచున్నాఁడు.

హను...అవ్విధః-

సరసిజపత్రనేత్ర! చనఁజాలితి వచ్చుటి కంచు బిట్టు వం
దురుచును బాష్పబిందువుల నూపుర మంచితమౌక్తికచ్ఛవిన్
బరఁగఁగ దానిహస్తమున మస్తమునన్ ధరియించి మాటికిన్
స్మరవశుఁడై వనిం దిరుగుస్వామిని గంటిని రామభద్రునిన్.

దేవి! ఇంతయేల? నీచరణాభరణము ప్రభువునకు సర్వాభరణ మయ్యెను.

సీత...నీ వెట్లెఱింగితివి?

హను...కన్నదానికిఁ గనులు ప్రమాణము; కననిదానికి లక్షణంబు ప్రమాణము.

సీత... తెలిసినది.

హను—అపు డమ్మా-

మరకతకాంతియుక్తములు మాద్యదళుల్ ధరణీజపంక్తు లాం
తరనిపతన్నదీసలిలధౌతగిరీంద్రనితంబభూములున్
సురుచిరపాండునీచికలఁ జొక్కు..మ గాంధులఁ దన్పు వాయువుల్
ధరణిపుఁ దేర్ప వయ్యె గుణధాము భవత్సుగుణైకకామునిన్.
తన ప్రియురాలి శైవలముఖంబునఁ దార్చెడు చక్రవాకమున్
వనజమరందపానమున వాహిరి రేఁగెడు తేటిభృంగమున్
బనిపడి తమ్మిదూండ్లరుచిపాండితి నొప్పెడు రాజహంసమున్
జనని! సమాశ్రయించు రఘుచంద్రుఁడు నీదరి కంప దూతఁగన్.

కెరలినఁ బోడు నెమిళ్ళ కేంకృతుల సలికి
మొగలిపూరేకులఁ గదల్చి పోఁడులు వలికిఁ
గార్మోయి ఝంప్పరమ్మునఁ గ్రమ్మరేల
క్షణము రఘుపతిప్రాణసంశయము వొందు.

అప్పుడు మెఱపు మెఱసినంత—

'మునిఁగె నాసీత మేనెల్ల మునిఁగె నీటఁ
జిగురుఁగేల్మ్రాఁతి నున్నదే మిగిలెఁ బైట'
యనుచు నోదేవి! రఘుదేవుఁ డప్టె యుఱికి
పలుమఱుఁగొనుఁ గేలఁ జెంగలువపూల.

తరువాత నింకొక యెడకుఁ బోయి-

తేఁజివుళ్ళ పందముగఁ గల్పించి సెజ్జ
పూవొకటి కోసి నీకొప్పునను దుఱుము
'రమ్మవై దేహి! నాజీవితమ్మ! విడుమ
కోప'మని వేడుకొను నొక్కకుసుమలతను.

సీత...మారుతీ! ఇట్టిది స్త్రీలకుఁ బ్రియముగదా నాకు దుఃఖమును సిగ్గును గల్గించుచున్నదే! చెప్పుచెప్పు అధన్యనగు నాకొఱ కిప్పటికిని నార్యపుత్త్రుఁ డట్లేయున్నాఁడా?

హను...లేదు లేదు. సహాయలాభమున స్వామివారిపుడు తేరినారు.

సీత...ఆర్యపుత్త్రునకుఁ గష్టమందలి యిష్టమిత్త్రుఁ డెవఁడు చెపుమా?

హను...తర్వాత వారి నావనమునుండి గొనివచ్చి సంస్కారము శరీర జీవాత్మలంబోలె నేను రామసుగ్రీవులఁ గలిపితిని.

సీత...మంచిపని చేసితివి.

హను...తరువాత శ్రీరాముల మహానుభావతచే వాలిభయ మత్యంతమును దూరీకృతముకాఁగా, సుగ్రీవుఁ డయత్నముగనే ఋక్ష వానరైశ్వర్యమును నిఖిలదిఙ్మండలైశ్వర్యమునునగు నప్రతిహతశాసనముఁ బొందెను. సుగ్రీవుఁ డిట్టు కృతార్థుఁడై పిదప నిన్ను వెదకుపూనికఁ బ్రభుకార్యమున వ్యాపృతుఁ డయ్యెను.

సీత...ఇది నాయదృష్టము!

హను...జన్మచేఁ బరిహాసమాత్రమైనను గర్మచే దేవతల నతిశయించు వానరవీరులను ఋక్షాధిపతులను గదుపువెట్టి యాశాచతుష్టయమునకుఁ బుచ్చుచు నీదిక్కునకు యువరాజు నాయకు నొనర్చి మమ్ముఁ గొందఱఁ బంపెను.

సీత... ఈదిక్కే శంకింపఁ దగినది.

హను... తర్వాతఁ బ్రభువు శ్రీరామచంద్రుఁడు వానరవీరు లందఱు నుండఁగాఁ దొలుత గాంచినదమ్మికపై నన్నుఁ జేరఁజీరియిది యొసంగెను.

(నమస్కరించి యంగుళీయక మిచ్చును)

(సంతోషముగఁ బుచ్చుకొని చూచి)

సీత... ఇది యస్మదంగుళీయకము! తపోధను లిచ్చినది! కుమారుఁడు కొని తెచ్చినది!

(మనోవ్యాకులతదోఁప విలపించును)

హను... పాప మీయమ్మ-యీభద్రముద్రికను-

అలకలయం దమర్చుకొను నాననమందు గదించు మాటికిం
బులకితబాహువల్లరుల ముమ్మరమౌ తమిఁగౌఁగిలించు నం
గుళి నవపల్లవంబులను గోరి ధరించును వేఱవేఱ ని
శ్చలమగుదృష్టి నిల్పి కను సల్లలితంబుగ ధ్యానలీనయై.

సీత... ఇది లోకాభరణుని యాభరణము! ఇది బాణాసనపరిఖిన్నము! ఇది రాక్షసమాయాసూచకము! ఇది రాత్రుల రత్నదీపము! ఇది వదనాలంకారార్థముగఁ బరికల్పింపఁబడిన యాదర్శము!

హను... ఈమెకై ప్రభు వంతకు మూఱుంత లున్మాద మొందవలసినదే!

సీత... అంగుళీయకమా! ఇపు డార్యపుత్రుని హస్తమునుండి నీవు నెడఁబాసితివి. నిన్ను నార్యపుత్రుఁడు పాణిగ్రహణ మొనర్చెను. నీ కివ్వనిచే విపన్నత్వము గల్గినది- నీవును నావలెనే రాక్షస బందీభూత వైతివి?

హను... శ్రీరఘూద్వహు నిడువాలు వ్రేలినిం దొ
ఱంగి విరహాగ్నిఁ గ్రాఁగు నీయుంగరమ్మ
భాసురచరిత్ర! యీనాల్గువాసరములు
విశ్రమము నొందు నీవ్రేలి నాశ్రయించి.

సీత... ఇది కొంత యూఱటగదా!

హను... బలారె!

రెల్లువలె విరహాభరమున
వెల్లనయగు నంగకముల వెలయఁగఁ బులకల్
నల్లఁదన మొదవె నుంగర
మల్లన నంగుళిని దొడిగినంతన సతికిన్!

సీత... ఈదివ్యానామాక్షరములనో రాఁబల్కెదను.(చేతనెత్తి చూచును)

హను... అకరుణరుచిరమైనదోసిట నచట నచట
జోటజోటన రాలి కన్నీటిచుక్క లెసఁగఁ
దెగిన ముత్తియములజిగి నెగడుకతనఁ
గములగర్భంబునను హిమకణములట్లు.

సీత... భద్ర! నీదర్శనమాత్రమున నన్ను దైవ మభిముఖ మయ్యెనని తెలిసి కొంటిని. మఱియు నంగుళీయకము తాకినంతనే యార్యపుత్రు నాలింగన మొనర్చుకొన్న ట్లయినది. ఇపుడు మరల వారి మాటలు విన నాహృదయము కుతూహలపడుచున్నది. అంతియ కాని మఱియొక గుఱుతుకొఱకుఁ గాదు. ఆర్యపుత్రుఁడు నమ్మికకుఁగాఁ జెప్పినమాట చెప్పుమా!

హను... మాయాలోకమున నున్నమిమ్ము దృఢముగ నమ్మించుటకుఁ గా నిదియుఁ జెప్పిరి-

"జాగొనరించి దీపమును నన్ను మొనర్చినవెన్క నీదుశ
ఖ్యాగ్రహ మేను జేర మధురాంచితభావల, 'దొంగ వీవు నిన్
బాగుగ శిక్ష సేతు,నని బాహుల విచ్చిన మల్లెదండతో
నాగతి కట్టికట్టితివ యంతకు గట్టిగ వాదు డెందమున!"

సీత... (సంతోషముతో) ఆశాలతా! ఇపుడు పూర్వ [illegible] నీ కమృతసేచనము సేయుచున్నాఁడు! హృదయమా! ఆర్యపుత్రుఁడు నీలో నున్నాఁడు! జీవితమా! నీవు యమలోకమునకుఁ బోవుచు నగముద్వారములోనే తిరిగివచ్చితివి!-.........

మారుతీ! యేమో చెప్పవలయునని యున్నది; ఏమి చెప్ప
వలయునో తెలియకున్నది. సీతకు నీ వాయుమూర్తి రఘురామప్రాణములతో
నీవు నాకుఁ బ్రాణము వైచితివి

హను...(అధోముఖుఁడై నిల్చును)

సీత...వాయుకుమారా? అన్నట్లుగ మఱచితిని - ఏయుపాయమున
మహాసముద్రము లంఘించి యిచ్చటికి వచ్చితివి?

హను...అమ్మా! తరువాతి వృత్తాంతము వినుము. అప్పుడు వానరసైన్యము
ప్రభునాజ్ఞను దైవనిర్మాల్యముంబలె శిరస్సున ధరించి యీ
దిక్కునకు బయలుదేరెను.

జలదసమూహవృతంబులగు క్ష్మాధరగహ్వరమధ్యసీమలన్
జలజలపాఱు నేళ్ళ యిసుచక్కఁదనమ్ము వనాంతరంబులన్
జలనిధి యంచునందు కొనసాగెడు చల్లనిగట్టు యంతటన్
బలితపుదీక్షను న్వెదకినారు కపీశ్వరు లింతకాలమున్.

తరువాత గడువు దాటవచ్చుటచే వానరులు తెల్లఁబోయి ప్రా
యోపవేశన మొనర్చిరి.

సీత...అయ్యయ్యో!

హను...అపుడు జటాయువు సోదరుఁడు సంపాతియను గృధ్రరాజు
మాటఁబట్టి మే మున్నతావునకు వచ్చెను.

సీత...వచ్చి?

హను...స్వామినీ! నీయీయవస్థను గలిసి మెలసి యున్నవానివలెఁ
గన్నులకుఁ గట్టినట్లు మాకుఁ దెలిపెను.

సీత...ఆహా! ఉపకారపక్షమ్ముగదా యీజాతి! మున్నీతనిసోదరుఁడు
తాతజటాయువు నాకారణమునఁ బ్రాణములు వదలెను.

హను...ఆమహనీయుని యుపదేశమువే మహార్ణవము దాటితిని;
ఈయుద్యానమును జేరితిని.

సీత...నీవు నాశోకసాగరమును దాటించితివి. వ్యసనకీర్ణధారా! మారుతీ!
చెప్పుమా యీవ్యసనమునకుఁ బర్యవసానకాల మున్నదా?

హను...అమ్మా! ప్రభువు సందేశించియున్నారు.

సీత...ఏమి నాకు సందేశకూడ కలదా? అనుగ్రహింపబడితిని.

హను...ఇది భర్తృసందేశము.

'ధనువు వంచి మున్ను ధరణీశుసభలోన
గురుగృహంబునుండి గొంటి నిన్ను;
ధనువువంచి యిప్పుడును యుద్ధరంగాన
గొందు నిను దశాస్యుబందినుండి.'

సీత...రాక్షసుని ప్రాణములు తొలుత గ్రహించి పిదప నన్ను గ్రహించు నా యార్యపుత్రుడు? అయిన నిపు డేల విలంబింతువు? వేగమే వెళ్ళుము. ఋషి యనుగ్రహమునకు నీచూడామణి నందుకొనుము. (తనలో) ఆర్యపుత్రుడిది చూచి నా నాయపేక్ష నెఱుంగగలడు.

హను...(తనలో) ఓహో! దేవియు చితజ్ఞతయు బరేంగితజ్ఞానమును. (పైకి) దేవి యనుగ్రహించుగాక (అందుకొనును)

సీత...ఆర్యపుత్రుడెట్లయిన శోకపరవశుడుగాడో యట్లు నావృత్తాంతము వారికి జెప్పవలయు.

హను...అనుగ్రహము.

సీత...నీ విపుడ వెళ్ళుము. నేను తొల్లిటివలెనే శింశుపాసంశ్రితనై మీవృత్తాంతము ప్రతిపాలించుచుందును.

హను...దేవియాజ్ఞ.

పాణిం గొన్నధనుస్సు దైత్యవధతో వర్జించి గోధాంగుళి
త్రాణస్థానములం గిణాంకములతో రాజిల్లుచున్ విత్యక
ల్యాణశ్రీకలశాతపత్రవరరేఖాన్వితమౌ కేల నీ
వేణీభారము శ్రీరఘూద్వహుడు దేవీ! చిక్కెడల్పుం జుమీ!

సీత...నీ కళ్యాణ్ము గుగాక; (నిష్క్రమింతురు)

---

అంగుళీయాంకము

విష్కంభకము

(విద్యాధరుండు ప్రియురాలితోఁ బ్రవేశింతురు)

విద్యా... సౌదామిని ! నే నిందఱక విద్యాదైవతము నారాధించుటచే మహేంద్రసేవాకాల ముపలక్షింపలేదు. కాన నీ వలసియున్నను నన్ననుసరించి రావలయును. వేళమించకుండ వేగముగాఁ బోవుదము.

సౌదా... వచ్చుచున్నాను!

విద్యా... రమ్మి సౌదామినీ !

వలచుపూదండమెఱుపులవాసిఁ బెంపఁ
గప్పుల హారంగు హరివిల్లుకాంతి నింప
నొప్పనీకొప్ప కొమ్మెగు లొప్పులాఁడి!
బిగ్గ బంధింపు; ధరియింపు బిగుతు రైక.

[ఇద్దఱు నాకాశయానము నిరూపింతురు]

విద్యా... సౌదామినీ ? చూడు చూడు !

కొండకోఁ నుండి, కాటుకగుండయట్లు
నీలరుచిమైననింగికి నెగయు మనకు
వసుధ గన్పట్టుచున్నది వసన వెట్టి
తనపదార్థముల్ తాన మ్రింగునదివోలె.

సౌదా... ఆర్య ! కులపర్వతము లిపుడు కన్పట్టియుఁ గన్పట్ట నట్లున్నవి.

విద్యా... ఆహా ! అభ్రగమనము నాకెంత శోభనమైయున్నది ! ఒక వంకఁ బ్రియాపయోధరస్పర్శము! ఇంకొకవంక దిగ్వధూపయోధరస్పర్శము!

మరకతచ్ఛవియగుస్త్రీ మేఘమార్గమంద
పై స్పృశించెడు స్వర్గీయమారుతములు;
కంకణమణీవినిర్గతకాంతివితతి
నొరయుదు స్నేను సజలమేఘోదరముల,

## —సప్తమాంకము—



[సన్నాహవేషముఁ దీసి శ్రీరాముఁడు లక్ష్మణ
విభీషణసుగ్రీవులతోఁ బ్రవేశించును]

**రాము**... మిత్రమా ! విభీషణా !

పట్టణమ్ముఁ బ్రవేశింపు; ప్రభువు లేని
ప్రజల వీక్షింపు; యుక్తకర్మములఁ దీర్పు;
గొప్పకడగండ్లలముఁ దమకొలమువారి
నారసి సమాశ్వసిల్లుఁ గా పౌరవితతి.

**విభీ**... ప్రభువు ప్రసన్నుఁడగుఁగాక! నేను బంధుస్నేహము లేక చెప్పు
నది కాదు–

సాధుజన మేడ? మేము రాక్షసుల మేడ? .
అయిన నన్నలరించు మీయాశ్రయమ్ము
డెప్పరపుఁబంట నిల్కడదప్పదంట
కాదు తరితీపు నా కన్నగారి కలిమి.

**రాము**... ధర్మము కాదిది; సిరిరా మోకా లొడ్డరాదు.

సుగుణభూషణ ! నీయన్న విగతగుణుఁడు
మించి నీతోడనే వెలారించినట్టి
ధర్మ మిప్పుడు నీమసదమ్ము నంటి
పదము మోపుతఁ బౌలస్త్యపదములందు.

**విభీ**... దేవ ! ఇది మొదలుగ—

స్థానమైతిని నేను సమ్మానమునకుఁ
గరుణ విరిసిననీచూడ్కి వారయఁ గనుట
హారుఁడు చేకొంట మనసంపుటగమపుటియఁ
దాల్చుచున్నారు బుధులు మస్తకములందు.

రాము... మిత్రమా! సుగ్రీవా! నీసఖుఁడు విభీషణుఁడు పర్యాకులుఁడై నట్లున్నాఁడు. కృతకరణీయుఁడగు సీతని లంకాప్రజలతోఁ గలుపుము.

సుగ్రీ... దేవర యాజ్ఞ. లంకేశ్వర! రమ్ము.

[సుగ్రీవవిభీషణులు నిష్క్రమింతురు]

రాము... విభీషణప్రతిష్ఠాపనమువలన నే నిపుడు కృతార్థుఁడ నైతిని. ఏమన-

కానలువాఱెడు నర్థులకోర్కి దీవ
నిష్ఫలంబగు నేని సాన్నిధ్యమునను
వానిసంపద నటుని సంపదవిధాన
ఛత్రచామరమాత్రలక్షణము గాదె?

[ప్రవేశించి]

సుగ్రీ... జయము దేవా!

రాము... సుగ్రీవ! వెళ్ళిన వెంటనే వచ్చితి వేమిది?

సుగ్రీ... దేవ! ఇది విభీషణవచనము-దేవి యెందనుకఁ బట్టణమునుండి నిష్క్రమింపదో యందనుక నేను బట్టణము ప్రవేశింపనని.

రాము... (సబహుమానముగ) అట్లయిన నీవె నీసఖుని గొని రమ్ము.

సుగ్రీ... ప్రభువునాజ్ఞ. (నిష్క్రమించును)

(సవితర్కముగా)

రాము... వాలిం జంపి మహార్ణవమ్ము నచలవ్రాతమ్మునం గట్టి యెట్లో లంకాపురిఁ జేరి బాంధవసహాయోపేతునిన్ రావణు నేలం గూల్చి కపీంద్రమూటపయి దేని న్నే నిరీక్షింతు నా రోలంబాలక యున్కిఁ బొందదుగదా లోకాపవాదాపదన్.

లక్ష్మ... ఆర్యుఁడు ప్రసన్నుఁ డగుఁగాక.

స్త్రీస్వభావంబు సుఖము వాంఛించుచుండు;
దుర్వినీతులు ఖలులు దైత్యులు కరమ్ము;
మనము దూరస్థులము; కాన మనవిసేతు-
ప్రభు! పరీక్షింపఁదగు దేవిభావశుద్ధి.

రాము... లక్ష్మణ ! హనుమంతుఁ డెక్కడ ?

లక్ష్మ... అతఁ డిప్పుడు యుద్ధభూమియందు-

చిన్నమైన శైలముల్ తొలఁగఁజిమ్ముఁ గపీంద్రుల లేవనెత్త; బిం
కమ్మైన లాగు రాక్షసముఖంబులఁ జిక్కినఋక్షరాజులన్;
నెమ్మదిమై వలీముఖుల నిర్ఝరవాహుల సేదదేర్చు; సం
ద్రిమ్మనున్న నక్రములఁ దన్నును దైత్యకళేబరంబులన్.

రాము... ఇతని కీపని తగియే యున్నది.

(నేపథ్యమున)

తొలఁగుఁ డార్యులారా ! తొలగుఁడు.

రాము... లక్ష్మణ ! ఏమిది ?

లక్ష్మ... ఆర్య ! ఇది యార్యురాలి యాగమనము.

రాము... దేవినిగూర్చి మహాజను లేమందురో గదా! లక్ష్మణా! సుగ్రీవు నాజ్ఞాపింపుము 'ప్రజలఁ దొలఁగింపవలదు. యానమునుండి డించి మైథిలిని వెల్లడిగఁ గొనిరావలయు' నని.

లక్ష్మ... చిత్తము. (నిష్క్రమించును)

రాము... దైత్యవిభుఁ బంక్తివదను నధఃకరించి
నన్ను మనసార సేవించుచున్న జనక
పుత్రి రూపమ్ము చారిత్రభూషణమ్ము
సర్వజన మారయుంగాక జంకు లేక !

[తర్వాత సీత లక్ష్మణసుగ్రీవులతోఁ బ్రవేశించును]

[నేపథ్యమున]

ఓహో ! లక్ష్మణసుగ్రీవుల సాధ్వాచారము !
దూరానతశిరు లౌచు నమ
స్కారము నొనరించు వీరిసదమలదృష్టుల్
తిరుగఁ బడుచున్నవి వ
హవ్వారే ! యీ రాజకన్యపాదములందే !

సీత... మహావనము నన్నట్లు తలంచునో ! ఆర్యపుత్రుఁడు నన్నట్లు తలంచునో ! స్త్రీస్వభావము నమ్మఁదగనిదిగదా! ... అధన్య నగు నాకొఱకుఁగా ననర్థసాగరమునఁ బడిన యార్యపుత్రుఁ డాత్మీయ బాహువుచే నుత్తీర్ణుఁడయ్యె-మారుతి నిజమే చెప్పెను-మొదట ధనువుచేఁ బరిగ్రహించినదాని నిపుడునుఁ ధనువు చేతనే యుద్ధరింపఁ గలఁడని.

[అందఱును సమీపించి]

లక్ష్మ... ఆర్య ! జయము.

సుగ్రీ... దేవా ! జయము.

సీత... ఆర్యపుత్ర ! జయము.

రాము... దేవి ! ఇటు—(అర్ధోక్తియందే మోము త్రిప్పికొనును)

ఉభయులు... ఏమి చెపుమా యిది !

రాము... లక్ష్మణ ! హనుమంతుని బిలువుము.

లక్ష్మ... చిత్తము. (నిష్క్రమించును)

రాము... సుగ్రీవ ! నీ వీమెను మున్ను జూడలేదు.

(సుగ్రీవుఁడు భీతుఁడై నిల్చును)

రాము... ఇప్పుడు చూడుము మున్ను జూచి యెఱుఁగని విరహచరిత్ర మును-

చందనపుఁబూఁత చక్క నెడంద నెసఁగఁ
గడు గుబాళించువిరులు క్రొమ్ముడిఁ బొసంగ
మించు చెంగావిచీర ధరించి యీమె
తీవ్రత వహించు బళి విరహవ్రతమ్ము!

సుగ్రీ... దేవ ! అతిగౌరవదోషమున నే నీమెను దేవర జూడుటకుఁ గొనివచ్చితిని.

రాము... నిజము లక్ష్మణుండును జూచియుండఁడు.

సీత... అయ్యో! అనసూయాదేవి యనుగ్రహముకూడ నా కిపుడు శాప మైనదే !

[లక్ష్మణుఁడు హనుమంతునితోఁ బ్రవేశించును]

లక్ష్మ...జయ మార్యా!

హను...దేవ ! జయము !

రాము...లక్ష్మణా! చూడుఁ డీమెను సిపును హనుమంతుఁడును-

[ఇర్వురును సీతను జూచి మొగము ద్రిప్పికొందురు]

హను...దేవ ! లంకలో నేను జూచినయామె వేఱు; ఈమె కాదు.

సీత...ఆర్య ! ఒకమనవి !

రాము...నీరూపమే మనవి సేయుచున్నది.

సీత...కుమారా ! నామాటవినుము.

లక్ష్మ...నీమాట వినుటకు ఫలమే యిది.

సీత...వినుము మారుతీ !

హను...గతించిన దాకాలము.

రాము...ఈమె యింకను నాయెదుట నిల్చియున్నదా ?

దినదినంబును సంకేతమున నిశాట
విటులను విరాళిఁ గవియుచు విటుకులాఁడి !
దండకాటవిఁ గికురించి యుండు దేమొ
వెడఁగుబడుగుల ఋజుభావజడుల మమ్ము!

[నవ్వుచు]

సీత...ఆర్యపుత్త్రుఁడును బరుసముగ మాటలాడుచున్నాఁడు !

సుగ్రీ...భర్త పల్కినయీకానిపల్కు విని యు

పక్కన న్నవ్వుచున్న దీపడఁతి యూర !
కాంత లందఱలోన నీకాంత మిపుల
నధమ కానోపుఁ; గానోపు నధికురాలు.

పరిభుసన్నిధినుండియీామె వెడలింపఁబడుఁగాక. చితాగ్నికిఁ రా
హుతి యేల ?

లక్ష్మ...ఈమెను శరీరముతోఁ బంపరాదు.

హను...దేవర యీామెకుఁ దగినదండము విధింతురుగాక;

సీత... ఆర్యపుత్రుఁ డనుమతించిన నగ్నిఁ బ్రవేశింపఁ గోరుదును.

రాము... లక్ష్మణా ! ఈపతివ్రత యిచ్చను నెఱవేర్పుము.

లక్ష్మ... చిత్తము. (తనలో) ఇపుడు సంతోషముగ నున్నది. (వెలికి) దేవి ! రమ్ము.

సీత... హృదయమా ! ఆర్యపుత్రునిపాదములకుఁ బ్రణమిల్లుము.

[లక్ష్మణుఁడు సీతయు నిష్క్రమింతురు]

రాము... సుగ్రీవా ! నీవును హనుమత్ప్రముఖసైన్యముతోఁ గూడి హతశేషులగు రాక్షసులనుండి కుమారుని రక్షింపుము.

సుగ్రీ... దేవరయాజ్ఞ.

[సుగ్రీవుఁడు హనుమంతుఁడు నిష్క్రమింతురు)

రాము... ఏమిచెపుమా ప్రత్యక్షమునుగూడ నప్రమాణ మొనర్చి నా మనము సీతయెడ నబహుమాన మగుచున్నది? విడిచియు విచారింపనేల? కేవలముగ లోకహితార్థమే నాయత్నము.

(కంటకితసర్వాంగుఁడు లక్ష్మణుఁడు ప్రవేశించును)

లక్ష్మ... ఆశ్చర్య మాశ్చర్యము!

రాము... వత్స! లక్ష్మణా! మేఘాంతరచరుఁడగు మేఘనాథునింద్రజిత్తును జయించినవాఁడవు. అట్టి నీగాత్రయష్టియుఁ గంటకిత మయ్యెను. చెప్పుచెప్పు యెందుండీ యీయావేగము?

లక్ష్మ... ఆర్యపాదుల శాసనమున సముద్రతీరమునఁ గాసారదారుని కరముల నగ్ని ప్రజ్వరిల్లఁ జేసితిని. అంత దేవి ప్రళయాగ్నివలె నంతట జ్వలించుచున్నయగ్నికి ముమ్మాఱు ప్రదక్షిణ మొనర్చి నీకును నయోధ్యావాసులగు గురుజనులకును బ్రణమిల్లి నన్ను జూచి యిట్లే గురువచన మొనర్చువాఁడవు కమ్మని పలికి భరతశత్రుఘ్నుల కిట్లే చెప్పుమని చెప్పెను. తరువాత నామె యిట్లన్నది - భగవంతుఁడా ! అగ్నిదేవా ! నీయెదుట నేను సత్యము చెప్పుచున్నాను. మెలకువనప్పుడు రాక్షసభుజస్పర్శ

మైనది. లంకయందు పాదస్పర్శ మైనది. అని నిర్విశంకముగ
జలముంబలె జ్వలనముం జొచ్చెను.

రాము... ఆశ్చర్యము!

లక్ష్మ... అపు డాకసమున శంఖపటహములు ప్రవర్తిల్లినవి. అంత-
దావుల నిల్చి మేము స్తిమితంబగుచూడ్కులం జూడ నంతట౯
ప్రావృష వైద్యుతవ్యతికరప్రభ వెల్గెడుమూపుం దాల్చి సీ
దేవి వసుంధరాత్మజ సతీమణి మున్నిడికొంచుం బేర్మిమై
దేవముఖమ్ము శ్రీజ్వలనదేవుండు కట్టెదుటం గనంబడె౯.

వేలావనకుసుమితతరు
జాలము విడి నింగి నలుపు సలుపం దేటుల్
వేలుపుం గ్రొవ్విరి వానలు
చాలుగం బడెం గన్నమొరగె, జ్వలనుం డంతన్.

రాము... ఆశ్చర్యమే! రమ్ము. చూతము.

(ఇరువురు పరిక్రమింతురు)

(నేపథ్యమున దివ్యగంధర్వులు గాన మొనర్తురు)

ముల్లోకముల గర్భమున నొక్కమూలం
జల్లగా వర్థిల్లుచాడ్పునం దాల్చి
యోగనిద్రారతి నుదధిమధ్యమున
భోగీంద్రశయ్య నొప్పుగం బవ్వళించి
స్తోతయు హవ్యమ్ము హుతవహుం డనంగ
నీతండే యని శ్రుతు లెన్నం బొల్పారు
నారాయణుండవు నళినాక్ష! నీవు
శ్రీరమాదేవి ధాత్రీపుత్రి సీత!

(నేపథ్యమున నితరులు గాన మొనర్తురు)

హిమరుచిం బొల్చు సింద్రిగ జేంద్రికన్న
ఛామరము దానమున నల్పునల్పి చదల

సురనదీపద్మరేణుధూసరిత మైన
మారుతము నీరణశ్రమ మాన్చెఁగాక!

రాము... అశ్రుతపూర్వ మీగ్రామరాగము!

(ఉభయులు నాకసముఁ జూతురు)

రాము... లక్ష్మణ! చూడుచూడు. భూమ్యాకాశములు ప్రభానుశేష
ములవలన నూతనములై కన్పట్టుచున్నవి-
సేతుశైలంబు లివి మేరుశృంగము లటు,
లీవనావళి కల్పవనావళిగతిఁ,
గనకకాంతుల మించు నీకపిచయమ్ము
మెఱుఁగు వెట్టినరీతిని మెఱసె నిపుడు!

(నేపథ్యమున)

నేను నారదుఁడ; దేవశాసనమున వచ్చుచున్నాను.

(ఇర్వురును సవినయముగ నవలోకింతురు)

(ప్రవేశించి)

నార... జయము జయము కారణమానుషుఁడగు రావణాంతకునకు.

రాము... లక్ష్మణా! నమ్మగాని యాశ్చర్యముఁ జూచుచున్నానే!

నార... ఇంతకంటెను ఆశ్చర్య మేమి? ఎల్లరకు నభిగమ్యులగు నింద్రాది
దేవతలు స్వయముగ రావణుని లంకకు వచ్చుచున్నారు.

రాము... కావున నేత్రప్రభాప్రవాహము! భగవత్ప్రసాదమునఁ బ్రపూతుఁ
డనైన నన్నన్యునివలెఁ జూచుచున్నారు.

నార... ఏనిమహిమ మక్షరమూర్తి ఋషి. నుతించు
వేయితెఱఁగుల కర్మముల్ వేనినెనయు
లోకభర్త మేధాతిథి మేకమఘవుఁ
డశనికేతు వషాంవర్షి యతఁడె యితఁడు.

రాము... భగవంతుఁడగు మహేంద్రునకుఁ బ్రణామము,

నార... నలుపుం జాయల మించు కంఠములతో నాగేంద్రహారాళితో
జ్వాలనోద్యత్కణగర్భనేత్రములతో భాసిల్లుచున్నాడు వీ
రలె రుద్రుల్ పదొకండు చంద్రకళలం బ్రత్యేకముం దాల్చి యా
వల శేషించిన వానిచూర్ణముఁ బలెన్ భస్మంబు మైఁ దాల్చుచున్.

రాము... వర్ణోత్తములగు దేవతలకు నమస్కారము.

నార... వీరు వసువులు- వీ రశ్వినులు.

రాము... లోకహితపరాయణులగు దేవతలకు నమస్కారము.

నార... మనువు మొదలుగ దశరథావనిపుదాఁక
వెలయు నీపితృదేవతల్ వీరె చూడు
మింద్రుఁ డిటు కల్మి రోసి నీవిచ్చుపిండ
మును నిరీక్షింతు రాసమై దినదినంబు!

రాము... వీరె లక్ష్మణా! మన నాన్నగారు చూడు
కౌఁగిలించుచున్నారు దృక్తతిని మనల;
సత్యము నచంచలముగ రక్షణ మొనర్పఁ
బ్రాణములతోడ నన్నును వదలినారు!

లక్ష్మ... అహ్హ! స్వప్నమువలెఁ బొమగట్టుచున్నది!

రాము... భగవంతుఁడా! దేవతలు ఋషులు పితరులు రాఁ గారణమేమి?

నార... సీదేవియగు సీత పాతివ్రత్యానుభావము.

రాము... ఈయద్భుతదర్శనమే నాకు విశ్వాసకారణము. అయినను
నన్నింకను సందేహపఱచుచున్నది యామోహపశోభానిమిత్తము!

నార... ఏ మేమి? ఎఱుఁగవా నీ మోహపశోభకుఁ గారణము?

రాము... భగవంతుఁడా! యెఱుఁగను.

నార... మహర్షిపత్నియగు నాయనసూయాదేవి వరప్రసాదముకదా!

రాము... దండకారణ్యమందును నాకిది సందేహాస్పద మయ్యెను!
పరమార్థ మెఱుఁగనైతిని.

నార... ఆమెకు శరీరగతమైన దేదియు నీదర్శనమార్గమున నలంకార రూపమగుచు. కావున నే-

నేలఁ బారవైచినంటుదూలి యదియె
పొలఁతిమేనికి గంధంపుఁబూఁత యయ్యె;
నాశ్రమమహీజముల రాలు నాకు లవియె
కలికిముంగురులకు నలంకార మయ్యె!

రాము... దేవశాసనము నెఱవేఱినది. సత్యవాదివియు సమాధిచతురుండవునగు నీవే ప్రమాణము.

లక్ష్మ... (తనలో) ఓహో! మందబుద్ధులమగు మేము వచనవిస్ఫులింగములచే రుష్టినను మహాదేవి వికృతి నంద దయ్యెను!

రా... భగవంతుఁడా! దేవతలుఁ బితరులు మహర్షులు నే మాజ్ఞాపించుచున్నారు?

నార... 'రామజీవితములోఁగూడ నివనవాసము సమాప్తమైనది. కావున దేవితోఁగూడ నయోధ్యాపురముఁ బ్రవేశింపు' మని.

రాము... అనుగ్రహింపఁబడితిని.

నారా... కాన దేవిని గొనిరా లక్ష్మణు నియోగింపుము.

రామ... (జనాంతికముగ) లక్ష్మణా! ఇపుడు కర్తవ్య మేమి?

లక్ష్మ... ఇంకను బరీక్షింపఁదగిన దేమి? ఆమె పరిశుద్ధికి దేవతలుఁ బితరులు మహర్షులును సాక్షులు.

రాము... (వెలికి) లక్ష్మణా! మహర్షి శాసన మనుష్ఠింపుము.

లక్ష్మ... చిత్తము. (నిష్క్రమించును)

నార... ఓహో! నీయనుభావము విస్మయనీయము!

రావణుండు త్రైలోక్యవిద్రావణుండు
నీధనుస్సున నిష్ప్రాణ నిర్గెఁ గాన

నోయీ రఘువీర! హారిధరు స్నాకట జలధి
సుహితముండలమ్ము శసమాత్ర మగుచు.

రాము... దానికి దేవతలు మునులే కారణము.

(తరువాత సీతయు లక్ష్మణుడును ప్రవేశింతురు)

సీత... శోచనీయ మీవృత్తాంతము- కాదుకాదు- సంతోష కారణమే.
ప్రస్థానసమయమున నెట్లో యాపాపుని హస్తస్పర్శమును లం
కయందు బాదస్పర్శమును గల్గినవి. ఆపాపుని శరీరస్పర్శముచే
శాంసులము లగు గాత్రము లగ్ని చేగాక యింకెట్లు పరిశుద్ధ
ములు కాగలవు ?

రాము... దేవీ ! ఇటుఇటు-

ధర్మశీలవయ్యు ధరణిజా ! నాచేత
సంశయింపబడి తసంగతముగ;
నెటులు విశ్వసింతు రెడబాటు ఘటియిల్ల
దక్కు-చెలుల శంకదక్కి-ప్రియులు ?

సీత... ఆర్యపుత్రుడు యదార్థము నెఱుంగును.

రాము... దేవి ! అనురక్తుడనైన నాయవిశ్వాసము ఫలవంతమే
యైనది. దేవతలును పితృలును మహర్షులును బ్రత్యక్షమైరి.
(తరువాత గృతాభిషేకుడు విభీషణుడు ప్రవేశించును)

విభీ... దేవా ! జయము జయము.

రాము... విభీషణా ! లంకావార్త లేమికి

విభీ... లంకయందలి మహాజన మెల్ల బ్రభువుగూర్చి యాలోచించు
చున్నది.

రాము... ఏమేమి ? (వ్యాకులుడై నిల్చును)

విభీ... 'పాలలో గల్లు కలిసెనని శంక గలిగినది! మేల్మిబంగార మగ్గిలో

చేయనేల ? చీకటి దివ్వెను వలువు సేయఁగలదా, యని.

రాము... జననాథుఁడు నీనుడుచే నిపు డూఱట కల్గినది.

విభీ... దేవ ! నాగరకులు మహాదేవిని గూర్చి వంచిన తలల నింకను నెత్తలేదు.

రాము... సీత యెంత మహానుభావు రాలో తెలిసికొంటిని.

విభీ... మఱియు పూజ్యుఁడగు కుబేరుని సొత్తిది!

పుష్పశరసమాన ! పుష్పకాఖ్యవిమాన
వసతి యిదియె సుగుణవసతి ! చూడు!
ముజ్జగమ్ము గొనియు ముజ్జగమ్మును గొన
నాశవోలె సావకాశ మగును!

రాము... లోకపాలుఁడగు పూజ్యునకుఁ గుబేరునకుఁ బంపివేయుఁడు.

నార... కాదు కాదు. రాక్షసుఁడు కలకాల మనుభవించుటచే మలీనమగు నీవిమానమును దేవియు నీవు నారోహించుటచేఁ బవిత్రీకరించి తర్వాత నయోధ్యనుండి కైలాసమునకుఁ బంపుఁడు.

రాము... చిత్తము లక్ష్మణా ! మొదట దేవిని రథ మెక్కింపుము.

లక్ష్మ... చిత్తము.

[సీత చకిత యగును]

రాము... (నవ్వి)

కలికిరో ! నేను రాముఁడనుగాని దశాస్యుఁడఁగాను; నీకా రథ
స్థలికి నయించువాఁడు సహజన్ముఁడు- సూతుఁడు గాఁడు నమ్ముమీ
పలుకు లిఁకేటికీ? వికచపద్మదళారుణమా కరాంగుళిన్
వెలయుచునున్నదే యిది యవింకితముద్రిక భద్రకాంతియై !

సీత... ఆశ్చర్యమణులకు నిదే యంజలి. లేకున్న నిపు డెట్లార్యపుత్రుని రాక్షసుని బరమార్థముగ నెఱుంగుదును ?

లక్ష్మ... అమ్మా! నీశాసనమున నాఁడు దండకాటవిని విడిచితి నేఁ
జూపుచో-

నా వ్రతమె నన్నుఁ గాచు బాణములుగావు
దైవమే సాక్షి యంటి యథార్థ మయ్యె!
నపుడు సామాన్యదృష్టి నే నన్నమాట
సైపు మీ చరణమ్ములే శరణ మమ్మ (ప్రణమిల్లును)

సీత... కుమారా! లెమ్ము లెమ్ము ఇంకఁ దప్పేమి? రక్కసునితల
తాఁకుటచే పాంసులములగు పాదము లిపుడు కుమారినిచేఁ క
డుగఁ బడినట్లు పరిశుద్ధము లైనవి.

(నేపథ్యమున)

దేవరయు దేవి నెఱపు ప్రభావమహిమ
బళిర! యతిమానుషం బౌచుఁ బరిఢవిల్లె;
అతఁ డాత్మనిశ్చయము నిరాకరించె;
ఆమె యవికారయై యగ్నియందు నిలిచె.

నార... భద్రముఖ! భగవంతుఁ డగ్నిదేవుఁడే నీ కిపుడు సాక్షి యయ్యె!

(ఆకసమున శంఖపటహములు ఎల్లరు నాశ్చర్యమునఁ జూతురు)

నార... భద్రముఖ! స్వవిక్రమణముచే దేవతలు నీనిష్క్రమణమును
ప్రేరేపించుచున్నారు

రాము... రమ్ము వైదేహీ!

మంగళ మెసఁగ దేవి నమస్కరింపు
దేవశాసనశంసి నీ దేవఋషిని;
వేద ముపవేదములతోడ బ్రోదిసేయ
బ్రహ్మచేఁ బాత్రముగఁ జేయఁబడిన ఘనుని!

(చేయిపట్టుకొని చూపును)

సీత...(నమస్కరించి) ఇపు డార్యపుత్రుని చేయి సోఁకుటచే సద్భుతాంగుళీయకము ప్రమాణ మైనది. రాక్షసమాయనుండి విడుమరఁ గాంచితి నని తలంచుచున్నాను.

రాము...మున్ను రాక్షసమాయచే వంచింపఁబడిన నాకు నాశ్చర్య చూడామణి దేవిదెస విశ్వాసకారణ మైనది.

నార...భద్రముఖ! దేవతల ననుగమింతును. నీకుఁ గ్రమ్మఱ నేమి ప్రియము చేకూర్తును?

రాము...కృతార్థుఁడను నేను! ఇం కేమి వాంఛింతును? అయిన నిది యగుఁగాక!

భరతవాక్యము.

అమరాధీశుఁడు మంత్రహవ్యముదితుండై చక్క వర్షించుతన్!
సుమబాణుం డపథమ్మునుండి మరలించుంగాత బాణంబులన్!
దమధర్మంబు నెఱింగి తాల్చెదరుగాతన్ ఱేండ్లు పట్టంబులన్!
విమలప్రజ్ఞ రహించుఁగాత సతమున్ విఘ్నంబులే కున్నతిన్!

ఓం తత్సత్.



# నాట్యభారతీగ్రంథమాలిక.

నాట్యకళాభిమానులారా !

రమారమి 2000 తెనుఁగు నాటకము లమ్మకమునకు సిద్ధముగా నిపుడంగళ్లలో నున్నను, ఉత్తమనటులు ప్రదర్శింపఁ దగినవిగాని, విద్యార్థులు పఠింపఁ దగినవిగాని, కళాపారీణులు మెచ్చుకోఁ దగినవిగాని, జనసామాన్యము కని యానందింపఁ దగినవిగాని యెన్నో లేవు. నిరక్షరకుక్షు లగు నాటకరచయిత లనేకులు ప్రబలి యసత్కథల నసభ్యరీతుల రచించి తక్కువధరల కందఁ జేయుచు లోకుల యభిరుచిని గలుషితమొనర్చుచున్నారు.

ఇట్టియెడ మరల సామాన్యజనుల యభిరుచులఁ జక్కపఱచి, దేశమున నాట్యకళ పెంపొందింపఁ జేయవలయునన్న మొదట నుత్తమ నాటకములఁ బ్రకటింప వలసియున్నది

అందు దేశకాలములఁ బట్టి సంస్కృతనాటకముల కగ్రస్థానము పొడగట్టుచున్నది. శాకుంతల మృచ్ఛకటికాది నాటకములు తెనుఁగు దేశమున విస్మరింపఁబడినను పాశ్చాత్యదేశములలో మిక్కిలి ప్రచారమునన్నవి. తదుపాసనచే వారు దినదినాభివృద్ధి నందుచున్నారు. కేవలముగ శాకుంతలోత్తరరామచరిత్రాదులే గాక వానితో సమానములయ్యు నిందచుకఁ దెలిఁగింపఁబడని యుత్తమసంస్కృతనాటకము లెన్నో యున్నవి. వానిని సులభముగను రసవంతముగను ప్రయోగానుకూలముగను ఆంధ్రీకరించి కళోన్నతికై ప్రకటించుటయే యీగ్రంథమాలికసంకల్పము.

కేవలముగ సంస్కృతనాటకములే గాక - యన్యభాషానాటకములు, స్వతంత్రనాటకములు, ఉత్తమప్రహసనములు, విమర్శనలు గూడ నిందుఁ బ్రకటింపఁబడును.

కావునఁ గళాభిమానులీగ్రంథమాలిక చిరస్థాయిని యగునట్లు సహాయ మొసంగుదురుగాక యని ప్రార్థించుచున్నాను.

ఇందు సంవత్సరమునకు నాల్గునాటకములు ప్రకటింపఁబడును. తదనుబంధముగ నొకప్రహసనమును ఒకపిమర్శనగ్రంథమును బ్రకటింపఁబడును. అనుబంధగ్రంథములలో సాధారణముగ నాడుచున్న కొన్ని నాటకములుగూడఁ బ్రకటింపఁబడును. చందాదారులు అనుబంధగ్రంథముల దప్పక పుచ్చుకొనవలయునను నియమము లేదు పరిధాన గ్రంథములు పుచ్చుకొనినఁ జాలు.

చందాదారులలో (ఏ)-(బీ) తరగతులు రెండున్నవి. సంవత్సరము చందా రూ కలును మొదటనే చెల్లించువారు (ఏ) తరగతి చందాదారులు. ఏపుస్తకమైన నాపుస్తకము వీ, పీ, గాఁ బంపగా సందుకొనువారు (బీ) తరగతి చందాదారులు.

సంవత్సరమునఁ బ్రకటింపఁబడు 4 నాటకములును

| | | | |
|---|---|---|---|
| (ఏ) క్లాసు చందాదారులకు. | పోస్టుఖర్చులతోసహా- | రూ 3 | లు |
| (బి) ,, ,, | పోస్టుఖర్చులుగాక- | రూ 3 | లు |
| ఇతరులకు— | ,, | రూ 4 | లు |

అనుబంధగ్రంథములు చందాదారులకు తగ్గింపుధరల కియ్యఁబడును—

వెలువడినది — పరిధమమప్పను.

శక్తిభద్రకవిప్రణీతము— ఆశ్చర్యచూడామణి-

రానున్నది— ద్వితీయపుష్పము.

దిఙ్నాగకవిప్రణీతము— కుందమాల—

ఇందలికథ సుప్రసిద్ధమగుకుశలవవృత్తాంతము. దీనిని జూచియే భవభూతిమహాకవి యుత్తరరామచరిత్రము వ్రాసెను. ఉత్తరరామచరిత్ర మందు గవిత్వప్రౌఢిమ హెచ్చుగా నున్నను కుందమాలలో నాట్యకళ సమధికముగ నున్నది. దిఙ్నాగుఁడు కాళిదాసకవికి సమకాలికుఁ డగుటయేగాక శత్రుప్రతిస్పర్ధి—

ఇంక నాతనినాటకముగూర్చి వేఱ చెప్పనేల ?

నాట్యభారతీభవనము } సంపాదకుఁడు,
విజయనగరము. } విశ్వనాథశర్మ

